# సామాన్యుడి మహా వాక్యాలు


రచన

ఆచార్య రాణి సదాశివమూర్తి



The Institute of Sanskrit and Indological Studies

VISAKHAPATNAM

2017

# సామాన్యుని మహావాక్యాలు

ప్రకాశకులు:

**The Institute of Sanskrit and Indological Studies**
విశాఖపట్నము

రచన:

**ఆచార్య రాణి సదాశివ మూర్తి**

సాహిత్య విభాగం,

రాష్ట్రియ సంస్కృత విద్యాపీఠం,

తిరుపతి, 517507 ఆంధ్రప్రదేశ్.

ప్రతులకు:

**శ్రీమతి రాణి రాధామాధవి,**

"సుమేరు", డోర్ నం. 23-2-204, ప్లాట్ నం. 17,

టి. టి. డి. ఫేజ్ II ప్లాట్స్, యమ్. ఆర్. పల్లి,

తిరుపతి 517 502 ఆంధ్రప్రదేశ్

Ph: 9440246354

ప్రథమ ప్రచురణ : 2017

దుర్ముఖ నామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ

ముద్రించిన ప్రతులు : 1000

© సర్వ హక్కులు రచయితవే

మూల్యము: రూ. 75/-

# తొలి స్పందన

శ్రీగురుభ్యో నమః. "సామాన్యుడి మహావాక్యాలు" పేరిట మహానుభావులైన మాగురువుగారు ఎత్తిన కలాన్ని దించకుండా మనకు అందించిన నూరు రసగుళికలకు అతి సామాన్యురాలినైన నన్ను ముందుమాట వ్రాయమనటం నాకు అసిధారావ్రతమైనా మహాప్రసాదంగా స్వీకరిస్తూ .....

"నేను సామాన్యుణ్ణి. నాకు నేనే మాన్యుణ్ణి. అన్నీ అందితే అసామాన్యుణ్ణి.", అని అతి సామాన్య వాక్యంతో 'నేను' అనే సామాన్యుని స్వాభిమానాన్ని, రవ్వంత ఆసరాతో అందలాన్ని అధిరోహించగలననే మనో స్థైర్యాన్ని , "నేను పై అంతస్తు కు వెళ్ళాలి. నీ వీపుని నాకు సోపానంగా ఇస్తావా?" అన్న వాక్యంలో ఆ 'నేను' అనే వ్యక్తి యొక్క దురహంకారాన్ని, మారుతున్న మన ప్రామాణిక విలువలను, స్వార్థపూరితంగా ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్న "నేను .. నాది ..నాకు" అన్న భావజాలాన్ని దర్పణం పట్టి చూపిస్తూ "గాలి వీచనంతవరకూ దీపం నిశ్చలం. మరో ఆలోచన

రానంతవరకూ నా బుద్ధి నిశ్చలం" అంటూ చంచలమైన బుద్ధి యొక్క చపలత్వాన్ని చెప్పకనే చెపుతూ, "నేను అజ్ఞానినా? నాకు తెలియనిదేముంది?" అంటూ సాగించిన వాక్యాల పరంపర ... వ్యంగ్యం, వైరాగ్యం, తాత్త్వికత, భావుకత, స్వాభిమానం, సునిశితత్త్వం ... అనే షడ్రుచుల మేళవింపుతో రాబోయే ఉగాదికి మాఘంలోనే షడ్రసోపేతమైన పచ్చడిని మనకందించినట్లు గా ఉంది. పండిత పామర తారతమ్యం లేకుండా అందరికీ అవలీలగా అవగతమయ్యేటట్లు అందించిన ఈ నూరు వాక్యాలు అరచేతిలో ఉన్న అమలకంలా సర్వులకూ సర్వదా ఉపయోగపడతాయనీ, నావంతు అభిప్రాయంగా తెలియ జేస్తూ ... నమస్తే!!

ఇట్లు మీ
పద్మ పోతుకూచి
(డా. పద్మ పోతుకూచి )
మనోవిజ్ఞానశాస్త్రనిపుణురాలు ప్రవర్తనావిశ్లేషకురాలు
హైదరాబాద్
దుర్ముఖ నామన సంవత్సర మాఘ బహుళ తృతీయ,
సోమవారం, ది. 13-02-2017

# నా నుడి

మహావాక్యాలు ఈ జగత్తు కు కారణభూతమైన బ్రహ్మతత్త్వాన్ని బోధపరిచేవి. సామాన్యులం మేం. మా కెందుకా వేదాంతం అని పక్కన పె/ సెట్టేస్తు ంటాం మనమంతా. అయితే సామాన్యులమైన మనందరిలో ఒక భావరాశి దాగి ఉంది. మన జీవితం. మన సంసారం. మన ప్రపంచం. వీటిని కాపాడుకోవటానికి మన ఆలోచనలు మనవి. మన తర్కం మనది. మన ప్రాచీన భారతం మనకిచ్చిన భావసంపదకు, మహోన్నతమైన విలువలకు మన భాష్యం మనది. అందరూ ఇదే నిజమనేలా ఒప్పించి ఔననిపించటంలో మనకు మనమే సాటి. అటువంటి మనందరి ఆలోచనలకు దర్పణమే ఈ "సామాన్యుడి మహావాక్యాలు."

ఈ చిన్ని పొత్తా న్ని వ్రాసి తొలిస్పందన కోసం అడిగిన వెంటనే తనకున్న ఎన్నెన్నో ముఖ్యమైన సమావేశాలున్నావాటినన్నింటినీ ప్రక్కకు పెట్టి ఎంతో మన్ననతో తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించిన శ్రీమతి డా. పద్మ పోతుకూచి గారికి నా మన:పూర్వక ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని తమ Institute of Sanskrit and Indological Studies , Visakhapatnam ద్వారా ప్రచురిస్తున్న ఆత్మీయ మిత్రులు డా. ఇవటూరి శ్రీనివాస రావు గారికి హృదయపూర్వకధన్యవాదాలు.

మన పనులు పెరిగిపోయి నానాటికి కాలం సంకుచితమై పోతోంది. ప్రబంధాలను చదవలేం. రూపకాలను చూడలేం. గానసభలను ఆస్వాదించలేం. ఆటైనా పాటైనా, కథైనా, కావ్యమైనా ఎంత చిన్నదైతే అంతం ఆనందం మనకు. ఇది సంక్షిప్త సందేశాల యుగం. కనుకనే ఈ సంక్షిప్తరచన.

చదవండి .. ఆలోచించండి. ఆనందించండి.

నమస్సులతో

**ఆచార్య రాణి సదాశివ మూర్తి**

దుర్ముఖనామ సంవత్సర మాఘ బహుళ తృతీయ, సోమవారం ది. 13-02-2017

**విజ్ఞాపనము: ఈ పుస్తకమునందలి చిత్రములన్నియు గూగుల్ సౌజన్యముతో డౌన్ లోడ్ చేసి ఉపయోగించినవియే.**

1. నేను చార్వాకుణ్ణి కాను కాని

"చారు" వాక్యాలు నాకు ఇష్టమే.

"తిను. తిరుగు. నిదురించు."







2. జగత్తు మిథ్య

బ్రహ్మమే సత్యం జ్ఞానికి.

జగత్తు నిజం నాకు

ఎందుకంటే నా బ్రతుకే నా జగత్తు.



3. నా పెతల కతలు వినేందుకు

నీ చెవుల జతను నాకిచ్చెయ్యి.



4. నావి ముమ్మాటికీ కష్టాలే.

నాకు తెలుసు కాబట్టి.

మరి నీవి!!!?? కష్టాలౌనో కాదో?



5. నేను  సామాన్యుణ్ణి.  నాకు  నేనే

మాన్యుణ్ణి.

అన్నీ  అందితే  అసామాన్యుణ్ణి.

నన్నర్థం  చేసుకోవటానికి

ప్రపంచమింకా ఎదగాలోయ్.



6. నాకు కోపం లేదంటే వినవేం?

విసిగిస్తావ్!?

నేను కోపిష్ఠి నా?



7. నా గురించి నేను

చెప్పుకోవటం నాకిష్టముండదు

కాని.

నాలో అందరూ సన్మానించుకోదగ్గ

మహాత్ముడున్నాడు.

ఆరోజు రావాలంతే.



8. నాకు నేనే గురువుని.

నాకు మాత్రం శిష్యులు కావాలి.



9. నేను అహింసావాదిని.

కాదన్నవాణ్ణి చెవి మెలిపెట్టి

ఒప్పిస్తా.



10. నా బాధలన్నీ తొందరగా

వినెయ్యి.

ఇంకా చాలామందికి చెప్పాలి.



11. వెలుగుండగానే విసేవాళ్ళని పట్టుకోవాలి.

చీకటిపడితే ఎవడి లోకం వాడిదీ!





12. నా గతం పురాణం

నా జీవితం ఇతిహాసం.

నే చెప్పిందే వేదం.

నన్ను ఒడపోసి చూడదే

ఉపనిషత్తు.



13. ఎవడికి వాడికి

ఎప్పటికప్పుడు

"నేను" నిజం. నువ్వబద్ధం.



14. నాలో ఒక రాక్షసుడున్నాడు.

నే కావాలనుకున్నది దొరికేదాకా

ఎవ్వరినీ పడుకోనివ్వడు.

నిశాచరుడు కదా!



15. నాలో  ఒకదేవుడున్నాడు.

నాకు  నువ్వు  మంచి  చెయ్యి.

నిన్ను  చల్లగా  చూస్తాడు.



16.నాకిష్టమైనది చెయ్యటమే ప్రపంచధర్మం.

నిన్ను బాగా "అర్ధం" చేసుకోగలను నేను.

నా కోరికలన్నీ ఎప్పటికప్పుడు తీరాలన్నదే

నా ఒక్కగానొక్క కోరిక.

నా కష్టాల్లో వచ్చావు సరే.

నా సుఖాన్ని మాత్రం ఒంటరిగా

అనుభవించనీ.

అదే నాకు మోక్షం. ఇవే నా"పురుషార్ధాలు"



17.. నా ఓర్పు ఆకాశమంత.

పరిధిలో ఉన్నంత వరకూ

మెరిసే గ్రహతారకలే.

పరిధి దాటితే ఉల్కాపాతాలే.





18. నేను ముక్కుసూటి మనిషిని. తిన్నగా ఉంటేనే గౌరవిస్తా సాటి మనిషిని.



19.నా కంటే గొప్పవాడొస్తే

గౌరవిస్తా.

వాణ్ణి చూసి ప్రపంచం నన్ను

మరువకూడదనే భయంతో.



20. నా బట్ట కంపు తెలియకుండా అత్తరులద్దా.

నా మనసు మకిలి తెలియకుండా నవ్వులు పులిమా.



21. గాలి వీచనంతవరకూ దీపం నిశ్చలం.

మరో ఆలోచన రానంతవరకూ నా బుద్ధి నిశ్చలం.



22. నాలోని జలపాతాలు

నింగివైపే ప్రవహిస్తాయి..

నాలోని పర్వతాలు పాతాళంలో

వేళ్ళూనుకున్నాయి.



23. నువు  వింటే  గుసగుసలు.

వినవో  మరి  విసవిసలే.



24. నేను   మునిని.

నా   లోపలే   మాట్లాడుకుంటాను



25. నాకు నిగ్రహం ఎక్కువ.

అందిన దానిమీదే మక్కువ.



26. కంటిముందు లేకపోతే

దేన్నీ నేను చూడను.



27.. నేనంటే  తెలియనంత  పెద్ద

'నేను'  నాలో  ఉన్న  నేను.



28. నేను. విశ్వం కంటే పెద్దది. విశ్వమంతా అదే. అదే విశ్వం దానికి.



29. నేను అనాది. నేను అనంతం.

నేను అణువు. నేను సర్వస్వం.



30. ఎప్పుడూ నా ఇంటిపేరు, నా వంటి పేరు నా జన్మను గుర్తుచేస్తు న్నా నేను మనిషిగా పుట్టానన్న విషయాన్ని మరిచిపోయాలా చేసే సందర్భాలే నా జీవితంలో ఎక్కువ.



31. చుట్టూ ఉన్న ప్రపంచంలో ఎన్ని అంతరించిపోతున్నా

నేను నమ్మనిది ఒక్కటే. నా మరణం.



32. పోయేదాకా తెలియదు నేను

పోతానని.

పోయాక తెలియదు. నేను

పోయానని.

అందుకని నేనెప్పుడూ చిరంజీవినే.



33. నా శరీరం మీది ముడుతలు, నా
నెరిసిన జుట్టూ చెబుతున్నా
నా మనస్సు ఒప్పుకోని విషయం నా
ముసలితనం.



34. నీకు వ్యాధి వస్తే శరీరానికి అది

ఒక వికారం.

తట్టుకోవటమే దానికి మంచి మందు.



35. మందగించిన నా చూపులో

నీ ఆరోగ్యం కూడా ఒక వ్యాధే.



36. పదవి ఉంటే చాలు నా వ్యాధి వ్యాధికాదు.

ఏ పదవీ లేకపోతే నా ఆరోగ్యం కూడా ఒక వ్యాధే.





37. సంసారం దు:ఖమయమని

ఎందరు చెప్పినా నాకీ దు:ఖమే

తియ్యగా అనిపిస్తుంది. కారణం ఈ

సంసారంలో  అందరూ నాలాగే

దు:ఖిస్తూ ఆనందించేవాళ్ళే.



38. సెల సెలా జీతమడగని భార్య,

ఆస్తిలో భాగమడగని కొడుకులు,

అడిగినప్పుడల్లా పాతబాకీ

అడగకుండా అప్పిచ్చే మిత్రుడూ

ఈ జగత్తులో ఎంతో పుణ్యం

చేసుకుంటేకాని దొరకరు.



39. నాకందని ఇంద్రపదవైనా

తృణమే నాకు.



40. ఒక్క పిలుపుకే అజామీళుడికి
వైకుంఠమిచ్చిన దేవుడు
నా భక్తికి ఎంత బాకీ పడ్డాడో!?
నా బాకీ ఎప్పుడు తీరుస్తాడో!?



41. నిముషం..ఈ రోజు చేయాల్సిన పనుల పట్టిక.నిముషం... నిన్న పూర్తికాని పనులపై బెంగ.నిముషం.. మర్చిపోయినమంత్రాల చింతన. నిముషం... నైవేద్యానికి అరటిపండు లేదని ఇల్లా లిపైకోపం. అవసరార్థం గుడనివేదనం.చివరి నిముషం.. అపరాధక్షమాపణశ్లో కం మాత్రం గట్టిగా చదువుతా. ఇది నా పూజ.



42. దేవుడికి మాత్రం నేనెప్పటికైనా

మారుతానని ఆశ.

దేవుడు అమ్మలాంటి వాడు.

అందుకే కరుణిస్తూ నేఉన్నాడు.



43. నన్ను నా కొడుకు

ఏడిపించినట్లు వాణ్ణి వాడి కొడుకు

ఏడిపించాలని నా మనుమడికి నేను

శిక్షణ ఇస్తున్నానని ఆరోపణ అందుకే

నేను చేరుకున్నది ఈ

వృద్ధాశ్రమానికి



44. నేనున్న వృద్ధాశ్రమంలో చోటు లేదట. నా భార్య వేరే వృద్ధాశ్రమంలో. ఇదీ మా వాన ప్రస్థం.  ఇదే మా ఇంద్ర ప్రస్థం.



45. పుట్టిన దగ్గరనుంచీ పంజరానికే అలంకారాలు.

చిలుకని పట్టించుకున్నది లేదు.

చిలుకకి విసుగెత్తి ఎగిరిపోయింది.



46. నిత్యం భయాలలో మునిగి తేలే వాడికి భయం కూడా అభయమే.



47. మనసుకు పట్టిన కిలుం

వదిలించటానికి చింతపండుకోసం

వెదుకుతున్నాను.

"చింత" పండాలి కదా.



48. విద్యుత్తు బల్బుల కాంతిని

తట్టుకోలేక నాలోని సత్త్వం

పారిపోయి తమస్సులో

దాక్కుంది. తమస్సు తెల్లగా

నవ్వుతోంది.మరి నామాటేమిటని

రజస్సు మరింత ఎర్రబడింది.



49. కాలం ....

నేను అమ్మ కడుపులో ఉన్నప్పుడు నాచుట్టూ ఉన్న మావి. నాబాల్యంలో నా ఆటపాటలలో కలిసిపోయింది.

నేను పెరుగుతున్నకొద్దీ నాలోని మమకారమై నన్ను పెనవేసుకుంది.

నా ముసలితనపు శిశిరంలో చలితోడేలై నన్ను తినెయ్యటానికి పొంచి చూస్తోంది.ముసలివాణ్ణి నన్ను తింటే దాని ఆకలి తీరదని దానికి తెలియదు.చెబుదామంటే నాకది కనబడదు.



## 50. నీ ఇంద్రియాలకు ఆకలేసిందా?

ప్రపంచాన్ని తినకు. చెప్పింది శాస్త్రం.

సరేనన్నాను కాని నా చుట్టూ ఉన్న

ప్రపంచాన్ని చూస్తే తోడేళ్ల మందలో

కుందేలులా ఉన్నది నా ఉనికి.

ఇంతలో సూర్యోదయమైంది.

తోడేళ్ళు మాయం.

వెలుగుతోనే నా ఆకలి తీరిపోయింది.

శాస్త్రం ఎప్పుడూ మంచే చెబుతుంది.

వేచి చూడాలంతే.



51. మనస్సును బంధించమన్నారు

కదాని ప్రయత్నించాను.

చేతికి చిక్కని ఊహల ప్రవాహమై

పారిపోతోంది.

అది అనంగం.



52. ప్రపంచాన్నర్థం చేసుకోవాలంటే

నన్ను నేను తెలుసుకోవాలట.

అందుకే ఈ 'స్వా'ధ్యాయం.



53. సత్యం గనిలో వజ్రం లాంటిది.

ఎంతతవ్వినా ఎప్పుడో కాని

బయట పడదు.



54. త్యాగం చేస్తే అమరత్వం

వస్తుందట

ఏం విడిచిపెడదామన్నా ఏదో ఒక

కర్మబంధం.

అందుకే పనిచెయ్యటమే వదిలేశా.



55. నిన్న నేడు రేపటి శాంతికి

మెట్లన్నారు.

ఎంత ఎక్కినా నేటి మెట్టు మీదే

నిలబడి ఉంటున్నాను.



56. అందరిగురించి పరోక్షంలో చెడు

మాట్లా డటంఅలవాటయిన నాకు

నా వెనుక ఎవరో ఏదో

మాట్లా డుతున్నట్టనిపించి

వెనుదిరిగితే అద్దంలో నా ప్రతిబింబం.

నేను ఆపినా నాగురించి అది చెడుగా

మాట్లా డుతూనేఉంది.



57. భయంతో బ్రతిమాలే వాళ్ళని

ఎంతమందిని చూసినా

నేను మరొకరిని బ్రతిమాలినప్పుడే

దయ అంటే ఏమిటో తెలిసింది.

అయితే అప్పటికే

దయ చూపగల స్థితిలో నేను లేను.



58. నిదురలో ఉన్న నేను

నా మనస్సు స్థిరమనుకున్నాను

మెలకువ వచ్చినప్పుడు తెలిసింది

అది దప్పిక గొన్న పక్షి గొంతంత

చంచలమని.



59. నా హృదయం ..

ప్రేమిస్తే కుసుమం...

అధికారమిస్తే పాషాణం ...

కోపిస్తే అగ్ని గుండం...

ద్వేషిస్తే ధూమ చయం.

ఇది హృదయమేనా?



60.. ప్రతిరోజు నిన్నటి నా మూర్ఖత్వం

నన్ను సిగ్గు పడేలా చేస్తూ నే ఉంది.





61. నా బుద్ధి స్థిరమైనదే

పరిస్థితులే స్థిరంగా లేవు.

నే తప్పు చేశానంటే ఒప్పుకోను.



62. వెలుగులేని దివ్వె .. నవ్వు లేని మోము

ఉంటాయా? రెండింటికి ప్రేరణ కావాలి.



63. ఎండలో తిరుగుతా. వానకు తడుస్తా.

ఎడారిలో పయనిస్తా. పర్వతాలనధిగమిస్తా.

చిన్న మాట పడక పోతే ఓర్పు లేదంటే ఎలా?



64. నిశ్చయమనే కోట గోడ మధ్యలో

ఉన్న గట్టి గుండె నాది.

దానికి తగిన పలకరింపే లేదు.



65. మనస్సు ఒక నిర్మల

ప్రవాహమైతే దేన్నైనా అది

కడిగేస్తు ంది

దాన్ని ఒక అడుసును చేసేవో

కడిగేందుకు ఏమీ మిగలదు.



66. నన్ను నమ్మిన వాళ్ళు నేననుకున్నట్టు ప్రవర్తించకపోతే ద్రోహం.

మరి నన్ను నమ్ముకున్నవాళ్ళకు నేనేమిస్తున్నాను?



67.  నన్ను పొగడకు. నన్ను పొగడకు .. అంటూనే ఉన్నాను. మరింతగా పొగిడేవాళ్ళు పెరుగుతున్నారు.
అది నాకు పొగడ్తలమీద ఉన్న ఇష్టాన్ని తెలుపుతున్నది.



68. దర్పాన్ని చూపి సర్పంలా

అభిమానపు మొగలి పొదలలో

నివసించనా?

కందర్పునిలా కన బడకుండానే

జీవనవనాన్ని నందనం చెయ్యనా?



69. నా శరీరానికి నేను చేసే
అలంకారాలన్నీ "నా" "పై"
మెరుగులే.
గుండెలోతులకి చేరని మెరుపులే.



# 70. నా మాట కఠినమనే మూర్ఖుడెవడని?



# 71. నేను అజ్ఞానినా?

# నాకు తెలియనిదేముంది?



72. ఇంతగొప్ప పరంపరకి

వారసుణ్ణి.

ఇంకా నే చెయ్యవలసింది ఏముంది?



73. నే చేసే మంచిలో భాగం

కావాలంటూ వచ్చేవాళ్ళెంతమందా?

నా తప్పులో కూడా భాగం

తీసుకుంటావా మరి? అనగానే

ఒక్కడూ కనబడడే?



74. నేను నీకు నాకున్నంతలో

ఇస్తాను కాని

మరి నువ్వు నాకేమిస్తావు?



75. నన్ను తిననీ! మీద పడకు.

మిగిల్తే నీకిస్తా! నేను దాతనే.



76. నేనెంతో చేద్దా మని ఎప్పటినుంచో అనుకుంటున్నాను.

కాని అవకాశం రావటం లేదు.



# 77. అందరూ పనిచేసే వాళ్ళేగా. నేను కూడా అవసరమా?



78. నేనందరిలా చెయ్యను.

దానికి ఒక ప్రత్యేకత ఉండాలి.



79. నాలో ఒక రాముడు,

పరశురాముడు, బలరాముడు

ఉన్నారు.

అయితే వారంతా ప్రస్తుతం విశ్రాంతి

తీసుకుంటున్నారు.



80. నాలో కల్కి, కలి ఇద్దరూ ఉన్నారు.

కల్కి అంగుష్ఠమాత్రంగా ఉన్నాడు.

కలి పర్వతంలా పెరుగుతున్నాడు.





81. నా పిల్లలని ప్రేమించటంలో నేను దశరథుణ్ణి.

నా పిల్లల తప్పులను

సమర్ధించటంలో ధృతరాష్ట్రుణ్ణి





82. నా దేహం నాఇల్లు. "నేను" ఆ ఇంటికి పెద్ద.

"నేను" కు ముద్దులపట్టి "నాది".

ఇంక గొడవే గొడవ.



83. ఏదైనా "నాది" అంటే ఇష్టం.

నీదంటే తట్టుకోలేని కష్టం.





84. నేనేం చేసినా పదిమంది

చూడాలి.

అందరూ పొగడాలి. అప్పుడే చేస్తాను.

అందుకే చేస్తాను.



85. వేదాంతంలో కూడా నాకు

నచ్చిన పదం "అహం".

"అహంతా" నేనే. "ఇదంతా" నేనే.



86. నేను నేనన్నదే నాకు తెలిసిన నిజం.

నేను ఒప్పుకునే నిజం వేరేదైనా ఉంటే అది పక్కవాళ్లకోసమే.



87. ఆశల పునాది పై శూన్యంలో కూడా ఊహల విశ్వాన్ని సృష్టించుకునే స్వాప్నిక విధాతను నేను.



88. నాదనుకునే జగత్తు ను ఎవరిని

దమించైనా

కాపాడుకునే పాలకుణ్ణీ నేనే.





89. శిథిలమైన ఆశలను,
ఆలోచనలోనూ నవోత్పత్తి కోసం
లయం చేసే లయ కారుణ్ణి నేనే.



90.నేను పై అంతస్తు కు వెళ్ళాలి.

నీ వీపుని నాకు సోపానంగా

అమరుస్తా వా?



91. జీవనం ఒక సమరం కాదు.

జీవనం ఒక కళ కాదు.

అదొక విద్య. నా అనుభవమే

అధ్యాపకుడు. నేను నిత్య విద్యార్థిని.



92. మేఘాల వెండి అంచులలోని

మెరుపులు

చిగురించే నాఆశల కన్నుల

జిలుగులు



93. దు:ఖం లోనూ, నిట్టూర్పు

లోనూ కూడా

ఆనందాన్ని చూసే నేను

తాత్త్వికుణ్ణి కానూ?!?



94. ఆకాశంలో విహరించే నాకు

భూమంతా రథమే.



95. జీవనగమనంలో

ఎత్తు కు ఎదిగిన కొద్దీ

శ్వాసమీద ధ్యాస.

బ్రతుకు మీద ఆశ.



96. పరుగుపందెంలో పాల్గొ న్న ఆటగాడిలా ప్రక్కనున్న వాణ్ణి నేను పట్టించుకోను.

నా పరుగు నాది. నా గెలుపు నాది.



97. వేటంటే నాకు బాగా ఇష్టం.

అయితే నేను వేటగాణ్ణి కాదు.

మృగాన్ని అని తెలిసే సరికి

నేను మోహపు వలలో ఉన్నాను.



98. నా పగటి కలలనన్నింటినీ

పిండి చేసి జల్లిస్తే ఆ కణాలు

రాత్రి గగనాన్ని

తారకలై అలంకరించాయి.



99. నా జీవన యజ్ఞానికి

నేనే ఋత్విక్కుని. నేనే

యజమానిని.

నా స్వార్థసిద్ధే యజ్ఞఫలం.



## 100.వేదాంతులకి నాలుగే మహావాక్యాలు

నా లాంటి సామాన్యుడికి బ్రతకటం

నేర్పేవన్నీ మహావాక్యాలే.



# స్వ'గతం'



పేరు : రాణి సదాశివ మూర్తి

జననీ జనకులు : డా. రాణి శ్రీనివాస శాస్త్రి, శ్రీమతి రాణి శ్రీదేవి

జనన తేది : 30.11.1958

విద్యార్హతలు : MA (Sanskrit), Ph.D, MA (English), MA (Philosophy), Vedanta Vidyapraveena, Jyotisha Acharya, MBA, PG Diploma in German, NET (UGC), CIC (IGNOU)

వృత్తి : రాష్ట్రియ సంస్కృత విద్యాపీఠం సాహిత్యవిభాగంలో ఆచార్యుడు

ప్రత్యేకవిషయాలు :

సంస్కృత కావ్యశాస్త్రం, వైదిక ఛందశ్శాస్త్రం, తంత్రములు, ప్రాచీనభారతీయ విజ్ఞానం, ప్రాచీన నిర్వహణాశాస్త్ర విశేషాలు మొదలైనవి

బిరుదములు :

సంస్కృత బంధు (2000సం.లో), విజయ్ శ్రీ (2005), నాట్యరవళి స్టేట్ టాలెంట్ అవార్డ్ (2007), వ్యాస్ భారతి (2007), ప్రజ్ఞాభాస్కర (2010),

రచించిన గ్రంథములు:

వదత సంస్కృతమ్, Vedic Prosody - Its Nature, Orign and Development, నవరత్నదీపిక, చాక్షుష యుగ్మం, ధ్వన్యాలోక పారిభాషిక పద కోశః, ధ్వన్యాలోకకారికార్థదర్శినీ,కారికాసారశ్చ, మనోన్మనీ, అగ్నిపుత్రాః వయం భారతాః, విద్యాపీఠ వైభవమార్గసూక్తయః మొ..వి.

నృత్యరూపకములు :

నాట్యావిర్భావం, రాధామాధవీయం, ఋతుసందేశం (తెలుగు), ఋతు సందేశం (సంస్కృతం), అర్థనారీశ్వర విలాసం, గౌతమి, శాంతి శిల్పి, సరిద్వైరాగం, విశ్వేశ్వర విజయం, బుద్ధబోధామృతం, ఆంధ్రకళావిలాసం, కాటనార్య విజయం, శ్రీ రామానుజ చరితం, నవనీత గీత, అమరావతీ వైభవం, శ్రీకృష్ణవేణీ విలసనం, శ్రీపద్మావతీశ్రీనివాసం మొ..వి.

సంపాదకునిగా:

సంస్కృతవిజ్ఞానవైభవం, Glimpses of Indo-Nepal Sanskrit Conference, Work Culture And Efficiency, with Special Reference to Indriyas, Ancient Indian Science and Its Relevance to the Modern World, The Epoch of Vivekanda in the Modern Age, వాక్యార్థవైజయంతి, జగ్గు వకుళభూషణకావ్యమాల, సంస్కృతవాఙ్మయే శ్రీపండితరాజ వరివస్యా మొ..వి.

పరిశోధనావ్యాసాలు :

వివిధ పరిశోధన పత్రికలలో ప్రచురించబడినవి, సదస్సులలో సమర్పించినవి ౭౦ పైగా ఉన్నాయి.

దర్శకత్వం వహించిన సంస్కృత చలన చిత్రం : హిడింబా భీమసేనం (రాష్ట్రియ సంస్కృతవిద్యాపీఠం నిర్మించింది)

విజయవంతమైన ప్రాజెక్ట్స్ : Electronic Text of The Mahabharata with Hyper Links, Gita Govindam (Audio) etc .,

పరిశోధన మార్గదర్శనం : పి.హెచ్.డి లు : 18, యమ్. ఫిల్స్ : 22

విదేశీ పర్యటనం : సెయింట్ పీటర్స్ బర్గ్, రష్యా (2004), ఖాట్మండు, నేపాల్ (2008)

ఇలా విద్యావ్యాసంగప్రస్థానం ముందుకు సాగుతూనే ఉంది.

ఈమెయిల్, చరదూరవాణి : ranisadasivamurty@yahoo.com, Ph. +91 9440246354